# అలంకారవిచారణ

సర్వంకషా వ్యాఖ్యలోవలెనే సంజీవనీ వ్యాఖ్యలోను అలంకారనిర్ణయమున పొరపాటులు జరిగియున్నవి. గ్రంథ విస్తర భయముచే మచ్చునకొక్కటిమాత్ర మిందు చూపు చున్నాను.

## ౧. ఉపమ

గీ. "మంత్రభృత్య, భూతభూతాత్త శాంభవ భూమిరుండు." (2-39)

"మంత్రములచేత సేవకు లయినట్టి బూచులచేత (బూచులమూలముగా) పొందఁబడిన శివసంబంధియైన వేషముకలవాఁడు—(భూతములను పనిగొనుచు అపరశివుఁడో యన నున్నాఁడనుట.-ఉపమ." (సంజీవని.)

(బూచులమూలముగా పొందఁబడిన) శివసంబంధియైన వేషము కల వాఁడు-అన్న వాక్యమున నిజముగా అలంకారము లేదు. 'ఉపమ' యఁట! అది యెక్కడ? పద్యములోనా? వివరణ వాక్యములోనా?

'అపరశివుఁడో యన నున్నాఁడు' అంటే ఉపమయగునా? ఉపమకు-అపరశివు డొకఁ డుండవలెగదా! ఉన్నాడా? అతడే లేనప్పుడు ఉపమించు టెట్లు?

ఎందుకు విస్తరము.—'అపరశివుఁడో యన నున్నాఁడు' అనునది, ఒక ఊహ. ఊహ ఉత్ప్రేక్ష యగునుగాని 'ఉపమ' కాదు.

ఆ యుత్ప్రేక్షయైనను - శాస్త్రిగారి వివరణ వాక్యములోనేగాని - పద్యములో లేదు. వ్యాఖ్యాత అలంకారమును చెప్పవలసినది మూలమునకు గాని-తన సొంతవాక్యమునకు కాదు.

దీపాల పిచ్చయ్యశాస్త్రికృత సాహిత్యసమీక్షలో
కావ్యములు ; వ్యాఖ్యానములు
అను భాగము సమాప్తము.

# కూర్పులు, మార్పులు

పుట 156లో,-చనవరి = కొలువుకాఁడు, సేవకుఁడు - అనుటకు,—
మడికిసింగన సకలనీతిసమ్మతమున రాజనీతిలో,—

(1) "జనటాయ గాండ్రును జనవరిలెంకలు-రాష్ట్రికంటకులు వీరల
నృపాలుఁ, డెపుడు మాన్పక సాగనిచ్చిన......అల్పుల నదలించి తినియు,
లంచములుగొన్న ధరయెల్లఁ బాడుగాదె?" (పద్యసంఖ్య 196)

చనవరిలెంకలు-అనగా 'చనవరు' లనబడు సేవకు లన్నమాట.

(2) "క్షత్రియుఁ గోపింప ఖడ్గముఁజూపుఁ జు
ట్టముఁ జనవరియు నోడరు భజింప,...
కాన నిట్టివిధము మానవులకు నధి
కార మీగి వెరవుకలిమి గాదు." (ప.సం. 215)

పుట 58లో,-పండ్లుకొఱుకుట-కోపలక్షణ మనుటకు,—
"పాలు తెంచికీరంబులు పండ్లుగఱవ" (శృం. నై. 1-96)

'పండ్లుగఱవన్ = ఫలములను కొట్టఁగా (కోపముచే పటపట పండ్లు
కొఱుకఁగా-అనియు)' వేదంవారి వ్యాఖ్య. 'పండ్లుకొఱుకుట అసూయా
లక్షణ' మన్న వా రీయుదాహరణమును చిత్తగింతురుగాక.

పుట 66 లో "కడలేని... ..ముసుఁగుదన్న" అన్నచోట, అర్థ
మిట్లు చెప్పికోవలెను.

వీడ్యంబు కప్పు = విడెమువల్ల కలిగిన నలుపు, చందురకావిమోవి
పల్లొత్తులన్ = ఎఱ్ఱని మోవియందలి పలునొక్కులను, ముసుఁగుదన్నన్ =
కప్పి తేయగా.

విడెపురంగును నలుపుగా చెప్పుట కలదు.—

(1) "మృగమదము మించు తములంపు టీరులు మోవి, దళముగా"
(ఆముక్త. ४-౧౩౫)

(2) "దరహాసములఁ దోఁచు తాంబూలసేవాంధ
కారితాధరరదక్షతుల యొఱపు" (మను. 6-44)

తాంబూలసేవా = తాంబూల సేవనముచేత (=తాంబూలపు కప్పుచేత) అంధకారిత=కనబడకుండా చేయబడిన, అధర దంతక్షతుల యొఱపు-అని యర్థము.

పుట. 92-'ఆనలువెట్టు' అనుటకు.—(కళా. ౬. ౬౬)

"పలికిన నేను సతలఁపుపద్ధతిగా కిపుడేమి మీఱి వ
ర్తిలితిఁ *దోడింబడక నిను వధింపఁగవచ్చెదనో యటంచు నా
కలఁగుచు రాకమాను మని యానలువెట్టఁగ." శ.ర. పా.

పుట. 100 లో,—వలరాచవారు = మన్మథుడు-అనుటకు.—

"అతివ తొడలును, జఘనంబు లరసిచూడఁ
గొమరుమీఱెడు జమిలితొండముల శిరసు
తోడి వలరాచవారి యద్భుతపుహస్తి
యగ్రభాగంబు చూపఱ కాత్మఁ దోఁప." (కళా. 7-133)

పుట. 166 లో,-కుట్టిమములు మేడమీది ప్రదేశము లనుటకు,—

"అధఃకృతాంభోధర మండలానాంయస్యాం శశాంకోపలకుట్టిమానామ్;
జ్యోత్స్నానిపాతాత్ క్షరతాం పయోభిః కేలీపదం వృద్ధి మురీకరోతి."

కుట్టిమ-శబ్దము,—రత్నాలుచెక్కిన కిరీటప్రదేశమునందును వర్తించునని యీ క్రింది పద్యము చెప్పుచున్నది.

"కైటభరిపునకు సురవర
కోటీర తటాగ్ర రత్నకుట్టిమ కురువిం
దాటోప కిరణరంజిత
పాటలిత విరాజమానపదపద్మునకున్."

(సకలనీతిసమ్మతము-ప. సం. 288)

కాఁబట్టి, 'కుట్టిమము = ఱాతికట్టనపు నేల' అనుటయు,—'శిలారత్నాది నిబద్ధభూమి' అనుటయు సరికాదు.

---

*తొడింబడిక-అని వావిళ్ల పా.

పుట 111, 266.—పొగరు = నీలకాంతి - యనుటకు,—

క. "కరము పొగరెక్కె నంబర
మురువిద్యుద్దీపకళిక లుమిసిన ధూమ
స్ఫురణఁ బొగచూరె ననఁగా
హరిమణిజంబూఫలాసితామలరుచులన్" ('ఆము'-4-138)

పుట 240.—రేవంతుఁడు = గుహ్యకు డనుటకు,—
"రేవంతప్రముఖ గుహ్యకులను,...నలకూబరుండు రావించె" (మను. 5-55)

పుట 276లో,—'అవ్వలించు' అను క్రియను, సూ.ని.-ద్వి.సం.లో,-ప్ర.సం. అనుబంధములో చూపియున్నది. (నే నిటీవల చూచినాను.)

పుట. 256-"కమ్మపంజుల వజ్రపుం జకచకల" అన్న 'మను' వచనమునకు,—

"కమ్మపంజుల=దివిటీలవలె వెలుఁగుచున్న కమ్మలయందలి, వజ్రపుం జకచకల = మగరాల కాంతులచేత" అని 'వావిళ్ల'వారి టీక. 'ఆనంద' వారి టీకయు నిదే.

కాని, 'కమ్మపంజు' అను పదములోని 'పంజు'కు 'దివిటీ' యని అర్థము చెప్పుచో, ఆ కమ్మ, పంజువలె వెలుగు వట్టి 'కమ్మ' యగునే గాని రత్నాలకమ్మ కానేరదు. అప్పుడు, అందు మగరా లున్నట్లు వర్ణించుట పొసగదు.

కావున ఆ కమ్మను రత్నతాటంకముగానే చెప్పవలెను. అట్లు చెప్పుటకు 'పంజు'కు మగరాలకట్టుబడి యనియే అర్థము చెప్పవలెను.

అందువల్లనే 'జూలూరి' వారు, దివిటీప్రస్తావమే యెత్తలేదు.— "కమ్మపంజుల...చకల=పంజులతాటంకములయందలి హీరమణులయొక్క" అని మాత్రమే టీక వ్రాసినారు.

ఈ క్రింది పదములు పుట 277 లో చేర్పదగినవి :

## ౨౮. అగ్రపుస్తకము

భారతములో,— "అగ్రపుస్తకంబు లర్చించి చూచుచు" అని (ద్రోణ. 2-345) యున్నది.

సూ.ని.లో, 'అగ్రపుస్తకము' లేదు.

## ౨౯. కరూశము

భాస్కర రామాయణములో,- "మలకలితమైన దేశము, మలదంబు కరూశయుక్త మహిగలదేశం, బలవడఁ గరూశము" (బాల. 33) అని యున్నది.

శ.ర., సూ.ని., వా.ని. కూడా "కరూశము = ఒకదేశము" అని మాత్రమే చెప్పినవి. ఒకదేశము - అను నర్థము పైపద్యమున సరిపడునా?

పుట 317లో,— '...బునంబొందు' అనుటకు, నన్నె. కు. సం. ప్రయోగము.—

"దివ్యశక్తు లెంత శేషంబులయ్యును...అతికోమలంబైన కొముశక్తికి లోనై మృదుభావంబునం బొందు" (4-78)

